# అథ తృతీయో%ధ్యాయః

# త్రిపురవధోపాయము

శివ ఉవాచ |

అయంవై త్రిపురాధ్యాక్షః పుణ్యవాన్ వర్తతే%ధునా| యత్ర పుణ్యం ప్రవర్తేత న హంతవ్యో బుధైః క్వచిత్ || 1

జానామి దేవకష్టం చ విబుధాస్సకలం మహత్ | దైత్యాస్తే ప్రబలా హంతుమశక్యాస్తు సురాసురైః || 2

పుణ్యవంతస్తు తే సర్వే సమాయాస్తారకాత్మజాః | దుస్సాధ్యస్తు వధస్తేషాం సర్వేషాం పురవాసినామ్ || 3

మిత్రద్రోహం కథం జానన్ కరోమి రణకర్కశః | సుహృద్ద్రోహే మహత్పాపం పూర్వముక్తం స్వయంభువా || 4

శివుడిట్లు పలికెను-

త్రిపురములకు అధీశుడగు ఈ మయుడు ఇపుడు పుణ్యవంతుడై ఉన్నాడు. వివేకి ఎన్నడునూ పుణ్యమును చేయు వ్యక్తిని హింసించరాదు (1). దేవతలారా! మీ కష్టమంతయూ నాకు ఎరుకయే. కాని బలశాలురగు ఆ రాక్షసులను దేవతలు గాని, అసురులు గాని చంపలేరు (2). మయుడు, మరియు తారకుని ముగ్గురు పుత్రులు పుణ్యాత్ములు. వారిని, వారి నగరములలో నివసించు వారిని సంహరించుట మిక్కిలి కష్టముతో గూడిన పని (3). నేను బుద్ధి పూర్వకముగా మిత్రులకు ద్రోహము చేసి రణమునందు క్రౌర్యమును ప్రదర్శించుట ఎట్లు సంభవమగును? మిత్ర ద్రోహము మహాపాపమని పూర్వము బ్రహ్మ చెప్పియున్నాడు (4).

బ్రహ్మఘ్నే చ సురాపే చ స్తేయే భగ్నవ్రతే తథా | నిష్కృతిర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః || 5

మమ భక్తాస్తు తే దైత్యామయా వధ్యాః కథం సురాః | విచార్యతాం భవద్భిశ్చ ధర్మజ్ఞైరేవ ధర్మతః || 6

తావత్తే నైవ హంతవ్యా యావద్భక్తి కృతశ్చ మే | తథాపి విష్ణవే దేవా నివేద్యం కారణం త్విదమ్ || 7

బ్రహ్మ హత్య, సురాపానము, చౌర్యము మరియు వ్రతభంగము అను పాపములకు మహర్షులు నిష్కృతిని కల్పించిరి. కాని కృతఘ్నతకు నిష్కృతి లేదు (5). ఓ దేవతలారా! ఆ రాక్షసులు నా భక్తులు. వారిని నేను ఎట్లు వధించగలను? ధర్మము నెరింగిన మీరు కూడా ధర్మబద్ధముగా ఆలోచించుడు (6). వారు నాయందు భక్తిని చేసినంతకాలము వారిని చంపే ప్రసక్తిలేదు. అయిననూ, ఓ దేవతలారా! ఈ సంగతిని విష్ణువునకు విన్నవించుడు (7).

సనత్కుమార ఉవాచ |

ఇత్యేవం తద్వచశ్శ్రుత్వా దేవాశ్శక్రపురోగమాః | న్యవేదయన్ ద్రుతం సర్వే బ్రహ్మణ ప్రథమం మునే || 8

తతో విధిం పురస్కృత్య సర్వే దేవాస్సవాసవాః | వైకుంఠం ప్రయయుశ్శీఘ్రం సర్వే శోభాసమన్వితమ్ || 9

తత్రత గత్వా హరిం దృష్ట్వా ప్రణ ముర్జాతసంభ్రమాః | తుష్టువుశ్చ మహాభక్త్యా కృతాంజలి పుటాస్సురాః || 10

స్వదుఃఖకారణం సర్వ పూర్వవత్తదనంతరమ్ | న్యవేదయన్ ద్రుతం తసై#్మ విష్ణవే ప్రభవిష్ణవే || 11

దేవదుఃఖం తతశ్శ్రుత్వా దత్తం చ త్రిపురాలయే | జ్ఞాత్వా వ్రతం చ తేషాం తద్విష్ణుర్వచనమబ్రవీత్ || 12

సనత్కుమారుడిట్లు పలికెను-

ఓ మునీ! ఇంద్రాది దేవతలు అందరు శివుని ఆ మాటను విని వెంటనే ముమ్ముందుగా బ్రహ్మకు విన్నవించిరి (8). అపుడు ఇంద్రాది దేవలందరు బ్రహ్మను ముందిడు కొని వెంటనే

శోభాయుక్తమగు వైకుంఠమునకు వెళ్లిరి (9). దేవతలు అచటకు వెళ్లి విష్ణువును గాంచి ఆశ్చర్యచకితులై చేతులు జోడించి నమస్కరించి గొప్ప భక్తితో స్తుతించిరి (10). వారు పూర్వమునందు వలెనే తమ దుఃఖాకారణము నంతనూ సర్వసమర్థుడగు ఆ విష్ణువునకు వెనువెంటనే విన్నవించిరి (11). అపుడు విష్ణువు దేవతల దుఃఖమును విని, దానికి కారణము త్రిపురాసురులని గ్రహించి, వారు గొప్ప వ్రతము గలవారని కూడ తెలుసుకొని ఇట్లు పలికెను (12).

విష్ణురువాచ|

ఇదం సత్యం వచశ్చైవ యత్ర ధర్మ స్సనాతనః | తత్ర దుఃఖం న జాయేత సూర్యే దృష్టే యథా తమః || 13

విష్ణువు ఇట్లు పలికెను-

ఈ వచనము సత్యమే. ఎచట సనాతన ధర్మము ఉండునో, అచట దుఃఖము కలుగదు. సూర్యుడు ఉన్నచోట చీకటి ఉండలేదు గదా! (13)

సనత్కుమార ఉవాచ |

ఇత్యేతద్వచనం శ్రుత్వా దేవా దుఃఖముపాగతాః | పునరూచుస్తథా విష్ణుం పరిమ్లాన ముఖాంబుజాం || 14

సనత్కుమారుడిట్లు పలికెను-

ఈ మాటలను వినిన దేవతలు దుఃఖమును పొంది వాడిన ముఖపద్మములు గలవారై మరల విష్ణువుతో నిట్లనిరి (14).

దేవా ఊచుః |

కథం చైవ ప్రకర్తవ్యం కథం దుఃఖం నిరస్యతే | కథం భ##వేమ సుఖినః కథం స్థాస్యామహే వయమ్ || 15

కథం ధర్మా భవిష్యంతి త్రిపురే జీవితే సతి | దేవదుఃఖప్రదా నూనం సర్వే త్రిపురవాసినః || 16

కిం వాతే త్రిపురస్యేహ వధశ్చైవ విధీయతామ్ | నో చేదకాలికీ దేవ సంహతిః క్రియతాం ధ్రువమ్ || 17

దేవతలిట్లు పలికిరి-

మా కర్తవ్యమేమి? దుఃఖమును పోగొట్టు ఉపాయమేది? మేము సుఖముగా జీవించుట యెట్లు? (15) త్రిపురాసురులు జీవించి యుండగా ధర్మము ఎట్లు నిలబడును? త్రిపురములలో నివసించు వారందరు దేవతలకు దుఃఖమునిచ్చువారే యనుట నిశ్చయము (16). నీవు ఏదో విధముగా త్రిపురాసురుల సంహారమునకు ఉపాయమును చేయుము. ఓ దేవా! అట్లు గానిచో, అకాల ప్రళయమును చేయుడు. ఇది నిశ్చయము (17).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్త్వాతే తదా దేవా దుఃఖం కృత్వా పునఃపునః | స్థితిం నైవ గతిం తేవై చక్రుర్దేవవరాదిహ || 18

తాన్వై తథా విధాన్ దృష్ట్వా హీనాన్ వినయసంయుతాన్ | సో%పి నారాయణ శ్శ్రీమాన్ చింతయే చ్చేతసా తథా || 19

కిం కార్యం దేవకార్యేషు మయా దేవ సహాయినా | శివభక్తాస్తు దైత్యా తారకస్య సుతా ఇతి || 20

ఇతి సంచింత్య తత్కాలే విష్ణునా ప్రభవిష్ణునా | తత్ యజ్ఞాస్స్మృతాస్తేన దేవకార్యార్థమక్షయాః || 21

సనత్కుమారుడిట్లు పలికెను-

అపుడా దేవతలు ఇట్లు పలికి పలుమారులు దుఃఖించిరి. దేవతలలో శ్రేష్ఠుడగు విష్ణువు యొక్క సన్నిధిలో వారు స్థిరముగా నుండలేక పోయిరి. మరియు వారచట నుండి బయటకు రాలేక పోయిరి (18). ఆ విధముగా దుఃఖితులై వినయముతో

ప్రార్థించుచున్న దేవతలను చూచి లక్ష్మీసనాథుడగు ఆ నారాయణుడు మనస్సులో నిట్లు తలపోసెను (19). ఆ దేవతలకు సాహాయ్యమును చేయుట నా స్వభావము. ఈ దేవకార్యమును సిద్ధింపజేయుట యెట్లు? తారకుని పుత్రులగు ఆ రాక్షసులు శివుని భక్తులు (20). సర్వ సమర్థుడగు విష్ణువు ఆ సమయములో ఇట్లు తలపోసి తరువాత దేవకార్యము కొరకై వినాశము లేని యజ్ఞాధిష్ఠాన దేవతలను స్మరించెను (21).

తద్విష్ణు స్మృతిమాత్రేణ యజ్ఞాస్తే తత్క్షణం ద్రుతమ్ | ఆగతాస్తత్ర యత్రాస్తే శ్రీపతిఃపురుషోత్తమః || 22

తతో విష్ణుం యజ్ఞ పతిం పురాణం పురుషం హరిమ్ | ప్రణమ్య తుష్టువుస్తేవై కృతాంజలిపుటాస్తదా || 23

భగవానపి తాన్ దృష్ట్వా యజ్ఞాన్ ప్రాహ సనాతనాన్ | సనాతనస్తదా సేంద్రాన్ దేవానాలోక్య చాచ్యుతః || 24

లక్ష్మీపతి, పురుషోత్తముడు అగు విష్ణువు స్మరించిన మరుక్షణములో ఆ యజ్ఞ దేవతలు ఆయన ఉన్నచోటికి విచ్చేసిరి (22). అపుడా యజ్ఞ దేవతలు చేతులు జోడించి యజ్ఞములకు ప్రభువు, పురాణ పురుషుడు, పాపములను హరించువాడునగు విష్ణువును ప్రణమిల్లిస్తుతించిరి (23). సనాతనుడు, అచ్యుతుడునగు విష్ణు భగవానుడు సనాతనులగు ఆ యజ్ఞ దేవతలను గాంచి, మరియు ఇంద్రాది దేవతలను చూచి, ఇట్లనెను (24).

విష్ణురువాచ |

అనేనైవ సదా దేవా యజధ్వం పరమేశ్వరమ్ | పురత్రయ వినాశాయ జగత్త్రయవిభూతయే || 25

విష్ణువు ఇట్లు పలికెను-

దేవతలారా! త్రిపురములను నశింపజేసి ముల్లోకములకు అభివృద్ధిని కలిగించుట కొరకై పరమేశ్వరుని ఎల్లవేళలా ఈ యజ్ఞములతో ఆరాధించుడు (25).

సనత్కుమార ఉవాచ |

అచ్యుతస్య వచశ్శ్రుత్వా దేవదేవస్య ధీమతః | ప్రేమ్ణా తే ప్రణతిం కృత్వా యజ్ఞేశం తేఽస్తువన్ సురాః || 26

ఏవం స్తుత్వా తతో దేవా అయజన్ యజ్ఞ పూరుషమ్ | యజ్ఞోక్తేన విధానేన సంపూర్ణ విధయో మునే || 27

తతస్తస్మాద్యజ్ఞ కుండా త్సముత్పేతుస్సహస్రశః | భూతసంఘా మహాకాయా శ్శూలశక్తి గదాయుధాః || 28

దదృశుస్తే సురాస్తాన్వై భూతసంఘాన్ సహస్రశః | శూలశక్తి గదాహస్తాన్ దండచాపశిలాయుధాన్ || 29

సనత్కుమారుడిట్లు పలికెను-

దేవదేవుడు, ధీమంతుడు, యజ్ఞేశుడు అగు అచ్యుతుని మాటను విని ఆ దేవతలు ప్రేమతో ప్రణమిల్లి స్తుతించిరి (26). ఓ మునీ! దేవతలు ఇట్లు స్తుతించి, తరువాత సంపూర్ణ విధివిధానముతో యజజ్ఞమును చేసి యజ్ఞమును చేసి యజ్ఞపురుషుని ఆరాధించిరి (27). అపుడు ఆ యజ్ఞకుండమునుండి పెద్ద దేహము గలవి, శూలము, శక్తి, మరియు గద ఆయుధములుగా గలవి అగు భూతములు వేల సంఖ్యలో గుంపులు గుంపులుగాపుట్టినవి (28). శూలము, శక్తి, గద, దండము, ధనస్సు, శిల అను వాటిని ఆయుధములుగా ధరించి యున్న ఆ భూతముల యొక్క వేలాది సమూహములను ఆ దేవతలు గాంచిరి (29).

నానా ప్రహరణోపేతాన్ నానావేషధరాంస్తథా | కాలగ్ని రుద్రసదృశాన్ కాల సూర్యోపమాంస్తదా || 30

దృష్ట్వా తాన బ్రవీద్విష్ణుః ప్రణిపత్య పురస్థ్సితాన్ | భూతాన్ యజ్ఞపతిశ్శ్రీమాన్ రుద్రాజ్ఞా ప్రతిపాలకః || 31

అనేక ఆయుధములను ధరించినట్టియు, అనేక వేషములను ధరించినట్టియు, ప్రళయకాలమునందలి అగ్నిని, రుద్రుని, సూర్యుని పోలియున్న (30) ఆ భూతములు విష్ణువునకు ప్రణమిల్లి

ఆయన యెదుట నిలబడెను. యజ్ఞేశ్వరుడు, లక్ష్మీపతి, రుద్రుని ఆజ్ఞను పాలించువాడు అగు విష్ణువు ఆ భూతములను చూచి ఇట్లు పలికెను (31).

విష్ణురువాచ|

భూతాశ్శృణుత మద్వాక్యం దేవకార్యార్థ ముద్యతాః | గచ్ఛంతు త్రిపురం సద్యస్సర్వే హి బలవత్తరాః || 32

గత్వా దగ్ధ్వా చ భిత్త్వా చ భంక్త్వా దైత్యపురత్రయమ్ | పునర్యథాగతా భూతా గంతుమర్హథ భూతయే || 33

ఓ భూతములారా! దేవతల కార్యము కొరకు పుట్టిన మీరు నామాటను వినుడు. అధిక బలోపేతులగు మీరందరు వెంటనే త్రిపురములకు వెళ్లుడు (32). రాక్షసుల ఆ త్రిపురములకు వెళ్లి వాటిని పగుల గొట్టి తగులబెట్టి మరల వచ్చిన దారిన వెళ్లుడు. ఓ భూతములారా! మీకు అభివృద్ధి కలుగ గలదు (33).

సనత్కుమార ఉవాచ |

తచ్ఛ్రుత్వా భగవద్వాక్యం తతో భూతగణాశ్చ తే | ప్రణమ్య దేవదేవం తం యయుర్దైత్యపురత్రయమ్ || 34

గత్వా తత్ప్రవిశంతశ్చ త్రిపురాధిపతేజసి | భస్మసాదభవన్ సద్య శ్శలభా ఇవ పావకే || 35

అవశిష్టాశ్చ యే కేచిత్పలాయన పరాయణాః | నిస్సృత్యారం సమాయాతా హరేర్నికటమాకులాః || 35

అవశిష్టాశ్చ యే కేచిత్పలాయన పరాయణాః | నిస్సృత్యారం సమాయాతా హరేర్నికటమాకులాః || 36

తాన్ దృష్ట్వాస హరిశ్రుత్వా తచ్చ వృత్త మశేషతః | చింతయామాస భగవాన్ మనసా పురుషోత్తమః|| 37

సనత్కుమారుడిట్లు పలికెను-

అపుడా భూతగణములు భగవానుని ఆ మాటను విని ఆ దేవదేవునకు నమస్కరించి రాక్షసుల త్రిపురములకు వెళ్లినవి (34). వెళ్లి ఆ నగరములలో ప్రవేశించు చుండగనే ఆ భూతములు, అగ్నిని ప్రవేశించు శలభములవలె, త్రిపురాసురుల తేజస్సులో వెనువెంటనే భస్మమైనవి (35). మిగిలిన కొద్ది భూతములు భయముతో పారిపోయి వేగముగా పరుగెత్తి విష్ణువు సమీపమును చేరినవి (36). పురుషోత్తముడగు ఆ హరి వారిని చూచి వారి వృత్తాంతము నంతనూ వినెను. అపుడా భగవానుడు మనస్సులో నిట్లు తలపోసెను (37).

కిం కృత్య మధునా కార్యమితి సంతప్త మానసః | సంతప్తా నమరాన్ సర్వానాజ్ఞాయ చ సవాసవాన్ || 38

కథం తేషాం చ దైత్యానాం బలాద్ధత్వా పురత్రయమ్ | దేవకార్యం కరిష్యామీత్యాసీచ్చింతా సమాకులః || 39

నాశో%భిచారతో నాస్తి ధర్మిష్ఠానాం న సంశయః | ఇతి ప్రాహ స్వయం చేశశ్శ్రుత్యాచర ప్రమాణ కృత్ || 40

దైత్యాశ్చ తే హి ధర్మిష్ఠా స్సర్వే త్రిపుర వాసినః | తస్మాదవధ్యతాం ప్రాప్తా నాన్యథా సురపుంగవాః || 41

'ఇపుడు నేనేమి చేయదగును?' అని చింతిల్లిన మనస్సు గలవాడైన విష్ణువు ఇంద్రాది దేవతలందరు దుఃఖించుచుండుటను గాంచెను (38). 'ఆ రాక్షసులను బలప్రయోగముతో సంహరించి మూడు నగరములను భగ్నము చేసి దేవకార్యమును సిద్ధింపజేయుట యెట్లు? ' అని విష్ణువుచింతతో దుఃఖితుడాయెను (39). ధర్మాత్ములకు అభిచార ప్రయోగముచే నాశము లేదని వేదాచారప్రమాణమును నిర్ణయించు శివుడు స్వయముగా చెప్పియున్నాడు (40). ఆ రాక్షసులు ధర్మాత్ములు. త్రిపురములందు నివసించు వారందరు ధర్మాత్మలు. ఓ దేవవరేణ్యులరా! కావుననే వీరిని వధించుట శక్యము గాకున్నది. మరియొక ఉపాయము తోచకున్నది (41).

కృత్వా తు సమహత్పాపం రుద్రమభ్యర్చయంతి తే | ముచ్యంతే పాతకై స్సర్వైఃపద్మ పత్ర మివాంభసా || 42

రుద్రాభ్యర్చనతో దేవాస్సర్వే కామా భవంతి హి | నానోపభోగసంపత్తిర్వశ్యతాం యాతివై భువి || 43

తస్మాత్తద్భోగినో దైత్యా లింగార్చనపరాయణాః | అనేక విధ సంపత్తేర్మోక్షస్యాపి పరత్ర చ || 44

తతః కృత్యా ధర్మ విఘ్నం తేషామేవాత్మ మాయయా | దైత్యానాం దేవకార్యర్థం హరిష్యే త్రిపురం క్షణాత్ || 45

ఎవరైతే రుద్రుని ఆరాధించెదరో వారు మహాపాపములను చేసిన వారైననూ, తామర ఆకులకు నీటి తడి లేని విధముగా సర్వపాపములనుండివారు విముక్తులగుదురు (42). ఓ దేవతలారా! రుద్రుని అర్చించువారికి భూమండలము నందు కోర్కెలన్నియూ ఈడేరును. వారు భోగములన్నిటినీ అనుభవించెదరు. వారు సంపదలను, వశీకరణ శక్తిని పొందెదరు (43). కావుననే ఆ రాక్షసులు లింగార్చణయందు నిష్ఠ గలవారై అనేక విధముల సంపదలను ఈ లోకములో అనుభవించి మరణించిన తరువాత మోక్షమును పొందెదరు (44). కావున నా మాయచే ఆ రాక్షసుల ధర్మమునకు ఆటంకము కలిగించి, దేవకార్యసిద్ధి కొరకై త్రిపురములను క్షణములో నశింపజేసెదను (45).

విచార్యేత్థం తతస్తేషాం భగవాన్ పురుషోత్తమః | కర్తుం వ్యవసితః పశ్చా ద్ధర్మ విఘ్నం సురారిణామ్ || 46

యావచ్చ వేద ధర్మాస్తు యావద్వై శంకరార్చనమ్ | యావచ్చ శుచికృత్యాది తావన్నాశో భ##వేన్న హి || 47

తస్మాదేవం ప్రకర్తవ్యం వేదధర్మస్తతో వ్రజేత్ | త్యక్త లింగార్చనా దైత్యా భవిష్యంతి న సంశయః | 48

ఇతి నిశ్చిత్యవై విష్ణుర్విఘ్నార్థమకరోత్తదా | తేషాం ధర్మస్య దైత్యానా ముపాయం శ్రుతిఖండనమ్ || 49

తద్దైవోవాచ దేవాన్ స విష్ణుర్దేవసహాయకృత్ | శివాజ్ఞయా శివేనైవాజ్ఞప్త సై#్రలోక్య రక్షణ || 50

పురుషోత్తముడగు విష్ణు భగవానుడు ఇట్లు ఆలోచించి ఆ రాక్షసుల ధర్మమునకు విఘ్నమును కలిగించుటకు నిశ్చయించెను (46). వేద ధర్మమును పాటించు చున్నంతవరకు, శంకరుని ఆరాధించు చున్నంతవరకు, శౌచము, నిత్యకర్మలు మొందలగు వాటిని పాటించుచున్నంత వరకు నాశము కలుగుట అసంభవము (47). కావున ఇట్లు చేసినచో, ఆ రాక్షసుల నుండి వేద ధర్మము తొలగిపోవును. రాక్షసులు లింగార్చనను విడానడెదరు. సందేహము లేదు (48). ఇట్లు నిశ్చయించి విష్ణువు అపుడు రాక్షసుల ధర్మమునకు విఘ్నమును కలిగించి, వేదధర్మమును ఖండించే ఉపాయమును పన్నెను (49). దేవతలకు సాహాయ్యమును చేయువాడు, ముల్లోకముల రక్షణయందు శివుని చేత నియోగింప బడినవాడునగు విష్ణువు శివుని ఆజ్ఞచే అపుడు దేవతలతో నిట్లనెను (50).

విష్ణురువాచ|

హే దేవాస్సకలా యూయం గచ్ఛత స్వగృహాన్ ధ్రువమ్ | దైవకార్యం కరిష్యామి యథామతి న సంశయః || 51

తాన్ రుద్రాద్విముఖాన్నూనం కరిష్యామి సుయత్నతః | స్వభక్తి రహితాన్ జ్ఞాత్వా తాన్ కరిష్యతి భస్మసాత్ || 52

విష్ణువు ఇట్లు పలికెను-

ఓ సర్వదేవతలారా! మీరు మీ గృహములకు నిశ్చయముగా మరలిపొండు. నేను నా బుద్ధికి తోచిన విధముగా దేవకార్యమును చేసెదను. సందేహము లేదు (51). నేను ప్రయత్నించి ఆ

రాక్షసులను రుద్రుని నుండి విముఖులగు నట్లు చేసెదను. ఇది నిశ్చయము. వారికి తన యందు భక్తిలేదని యెరింగిన శివుడు వారిని భస్మము చేయగలడు (52).

సనత్కుమార ఉవాచ |

తదాజ్ఞాం శిరసాధాయాశ్వాసితాస్తే%మరా మునే | స్వస్వధామాని విశ్వస్తా యయుర్బ్రహ్మాపి మోదితాః || 53

తతశ్చైవాకరోద్విష్ణుర్దేవార్థం హితముత్తమమ్ | తదేవ శ్రూయతాం సమ్యక్ సర్వపాపప్రణాశనమ్ || 54

ఇతి శ్రీ శివమహాపురాణ రుద్రసంహితాయాం యుద్ధఖండే త్రిపురవధోపాయ వర్ణనం నామ తృతీయో%ధ్యాయః (3).

సనత్కుమారుడిట్లు పలికెను-

ఓ మునీ! విష్ణువు ఆజ్ఞను శిరసా వహించి ఆ దేవతలు విశ్వాసము గలవారై ఆనందముతో తమ తమ నెలవులకు వెళ్లిరి. వారికి ఓదార్పు కలిగెను. బ్రహ్మ కూడా తన ధామమునకు వెళ్లెను (53). అపుడు విష్ణువు దేవతలకు ఉత్తమమగు హితమును చేసెను. పాపములన్నిటినీ నశింపజేయు ఆ గాథను చక్కగా వినుడు (54).

శ్రీ శివమహాపురాణములోని రుద్రసంహిత యందు యుద్ధ ఖండలో త్రిపురవధోపాయ వర్ణన మనే మూడవ అధ్యాయము ముగిసినది (3).